# కమ్యూనిస్టులు:
# కాంగ్రెసు

భారతదేశ సంపూర్ణ స్వాతంత్ర్యమునకై చేసే
యుద్ధంలో భారతదేశపు కమ్యూనిస్టులు
ఎట్టి పాత్ర ధరించాలో
తెలిపే వ్యాసం.

**20**

అనువాదకర్త,
"తాంతియా"

THE ANDHRA BOOK HOUSE,
SULTAN BAZAR, HYDERABAD-DN.

# ఒక్క ముక్క

శాసనోల్లంఘ నోద్యమపు రోజుల్లో కాంగ్రెసు యెడల కమ్యూనిస్టులు అవలంబించిన వైఖరిని విమర్శించిన వాళ్ళున్నారు. ఈ సమస్యలో కమ్యూనిస్టులు నేడు యే స్థానం వహిస్తున్నారో ఆ విమర్శకులు అర్థం చేసుకోలేక పోతున్నారు. ప్రతివాడికీ కమ్యూనిస్టులు వాళ్ళ వైఖరిని మార్చుకున్నారా, మార్చుకుంటే యే వుద్దేశంతో మార్చుకున్నారు? కమ్యూనిస్టులు కాంగ్రెసు సంస్థను నిజంగా ఆక్రమించగోరుతున్నారా, లేక కాంగ్రెసును భగ్నం చెయ్యదలుస్తున్నారా అనే ప్రశ్నలు యెప్పుడూ యెగరొక్కంటూనే వుంటాయి.

అందుచేత యీ విషయములో కమ్యూనిస్టులు స్వతహాగా చేసిన ప్రకటనాన్ని "నేషనల్ ఫ్రంటు" పత్రికలో 1938 ఫిబ్రవరి 13 వ తేదీని వెల్వడిన సంపాదకీయ

వ్యాసంలోని కొన్ని భాగాలతోపాటు చదువరులకు అం దింసతున్నాము.

ఈ కరపత్రం కమ్యూనిస్టులు నేడు యే స్థానంలో వుందీ చక్కగా తెలుపుతుంది. దీనిలోని వ్యాసంప్రకారం "మనంవెంటనే చెయ్యాల్సిన పని భారతదేశపు ప్రజలకు బంధవిముక్తి చెయ్యడం, ప్రజాస్వామిక ప్రభుత్వానైక దానిని నెలకొల్పడం" "బ్రిటిషు సామ్రాజ్య వాదానికి వ్యతిరేకముగా పోరాడుతూవున్న భారత ప్రజల కేంద్ర సాముదాయిక రాజకీయ వ్యవస్థగా పెరిగిన కాంగ్రెసులో నిర్ణయనిర్ధారణ చేయగల శక్తిగా కావడం" ఈ కరపత్రం చదివిన తర్వాత కమ్యూనిస్టుల వైఖరి సుబోధక మాతుంది. కమ్యూనిస్టులు బ్రిటీషు సామ్రాజ్యవాదంపై జరిగే భారతస్వాతంత్ర్య యుద్ధములో యుద్ధప్రాంగణ మున నిలిచి అగ్రత్యాగముచేసే యోధులుగా వుంటా రని చదువరికి తేలిపోతుంది.

భారతదేశపు కమ్యూనిస్టు పార్టీ నిషేధంలోవున్నదని ప్రతివాడికీ తెలుసు. అయినా కమ్యూనిస్టులు ప్రకటిం

చారుసుమా యీ- యీ-కరపత్రాలంటూ యెక్కడవో కొన్ని కరపత్రాల్లోనుంచి క్రోడీకరణాలిచ్చి కమ్యూనిస్టుల ప్రచారమును ప్రజలుమన్నించగూడదంటూ మద్రాసు ప్రభుత్వం యీ మధ్య లేనిపోని అపనిందలతో వొక "దురుద్దేశపు ప్రకటన" చేసింది. ఆ ప్రకటన దృష్టిలోవున్న ప్రతి చదువరికీ యీ పుస్తకంద్వారా కమ్యూనిస్టుల నిజాయితీ తెలిసివొస్తుంది. ఈ కరపత్రం తెలుపుతున్నట్లు గానే, భారత జాతీయమహాసభను గురించీ, ప్రజాప్రతినిధి పరిషత్తును (కాన్స్టిట్యుయెంటు ఎసెంబ్లీని) గురించీ, స్వాతంత్రయుద్ధమును యింకను తీవ్రతరముచేసి నడపవలసిన పద్ధతులను ముందు అవలంబించవలసిన యెత్తుగడలను గురించీ కమ్యూనిస్టులకు స్పష్టమైన నిశ్చితాభిప్రాయాలున్నాయి.

సంపాదకుడు

# ఆదర్శ గ్రంథ మండలి,

ఎలమర్రు. కృష్ణాజిల్లా.

| | | |
|---|---|---|
| 1 | బ్రహ్మచర్యం | 1—0—0 |
| 2 | దేవీ జోన్ | 0—8—0 |
| 3 | భారతీయ ప్రబోధము | 0—1—0 |
| 4 | కర్షకుని కాలగతి | 0—2—0 |
| 5 | డీ వేలరా | 0—8—0 |
| 6 | గాంధీ గారంటే? | 0—0—6 |
| 7 | కమ్యూనిష్టు కరపత్రము (నిషేధము) | 0—4—0 |
| 8 | సామ్యవాద సిద్ధాంతాలు | 0—2—0 |
| 9 | సామ్రాజ్యవాదము (నిషేధము) | 0—2—0 |
| 10 | మన ధనం (అయిపోయింది) | 0—1—0 |
| 11 | అమ్మ | 1—8—0 |
| 12 | కామ్రేడ్ డిమిట్రాఫ్ | 0—1—0 |
| 13 | వలసదేశాల సమస్య | 0—1—0 |
| 14 | స్టాలిన్-లడ్విగ్గు సంభాషణ | 0—1—6 |
| 15 | మన సంపద (10 నెం రెండోముద్రణ) | 0—1—0 |
| 16 | క్రాంతి గీతాలు | 0—4—0 |
| 17 | మాలపిల్ల | 0—4—0 |
| 18 | తిరుగుబాటు | 0—4—0 |
| 19 | కమ్యూనిజానికే జయం | 0—1—0 |
| 20 | కమ్యూనిస్టు:కాంగ్రెసు | 0—1—0 |

——(*)——

# కమ్యూనిస్టులు : కాంగ్రెసు



1. కమ్యూనిస్టులు యింతవరకు పలుకుబడిగల వొక రాజకీయ శక్తిగా ప్రవర్తించి యుండకపోవడం కమ్యూనిస్టుల ముఖ్య లోపాల్లో వొకటి. ట్రేడుయూనియనులను నిర్వహించడంలోనూ, కొంతవరకు కర్షకపోరాటములను నడపడంలోనూ మనము పెద్దపెద్ద జయములు పొందేము. కాని జాతీయ బంధవిముక్తికై జరిగే పోరాటంలో జోరుగా పాల్గొంటూ, దానిని సామ్రాజ్యవాద వ్యతిరేకమైన సంకుల సమరముగా మార్చే రాజకీయ శక్తిగా ముందుకు తీసుకురాలేక పోయాము.

2. కమ్యూనిస్టుల గమ్యస్థానము నిస్సందేహముగా సోషలిజం. భారతదేశంలో కార్మిక కర్షక సోవియటుల

రాజ్యమును స్థాపించి మనం సామ్యవాదాన్ని సాధింప జూస్తున్నాము. కాని మనం వెంటనే చెయ్యాల్సిన పని భారతదేశపు ప్రజలకు బంధవిముక్తి చెయ్యడం, ప్రజాస్వామిక ప్రభుత్వాన్నొకదానిని నెలకొల్పడమూను. మనదేశపు ప్రజలలో అత్యధిక సంఖ్యాకులను యీ దేశానికి ప్రబల శత్రువైన బ్రిటిషుసామ్రాజ్య వాదానికి వ్యతిరేకంగా, సంయుక్తంగా జరిగే పోరాటంలో సంఘీభవింప జేసే ముఖ్యలక్ష్యం యిదే. నేడు లక్షలకొలదిగా భారత జాతీయమహాసభా పతాకముక్రిందకు మూగుతూ వున్న ప్రజాసముదాయాల్ని ముందుకు తోలుకుపోయే శక్తి స్వాతంత్ర్యమునకూ, ప్రజాస్వామికమునకూ ప్రజలలోగల తీవ్రవాంఛయే. ఈ సంయుక్త జాతీయ పోరాటంలోని ముఖ్యనినాదాలు: బానిస రాజ్యాంగమును భగ్నం చెయ్యడం, స్వతంత్ర భారతదేశ రాజ్యాంగాన్ని నిర్ణయించడానికిగాను వొక ప్రజాప్రతినిధి పరిషత్తును సమకూర్చడం, ప్రజాస్వామికములోని ముఖ్య హక్కులనూ, స్వాతంత్ర్యములనూ కాపాడుటకు గ్యారంటీ యివ్వడం, అందరికీ తగుపాటి జీవిత ప్రమాణమునూ, శ్రమప్రమాణమునూ సాధించడం.

3. భారతదేశపు శ్రామికవర్గము యీ దేశంలో జరు

గుతూవున్న రాజకీయ పోరాటములో పాల్గొనకపోతే, మొత్తంగా భారతప్రజలకందరికీ ప్రజాస్వామిక హక్కులను కాపాడే అప్రతిహతమైన సంఘముగా ముందుకు రాకపోతే, భారతదేశపు ప్రజలందరూ విదేశ సామ్రాజ్యవాద పరిపాలనమునకు వ్యతిరేకంగా జరిపే పోరాటమును యింకనూ విస్తృతముచేసి యింకనూ యేకీకరణముచేసి భారత జాతీయమహాసభ యొక్క నాయకత్వాన సంఘటిల్లిన స్వాతంత్ర్య యుద్ధభూమిలో ప్రప్రథమ స్థానమాక్రమించుకోకపోతే శ్రామిక ప్రజాసామాన్య సాంఘిక విమోచనా కార్యం చేయడానికి సమర్థమై యుండజాలదు.

4. 1930-32లో జరిగిన సామ్రాజ్యవాద వ్యతిరేక పోరాటాలలో విస్తృతమైన జాతీయోద్యమములో కమ్యూనిస్టులు మొత్తంమీద చేరలేదు. ప్రతి సంఘర్షణములోనూ, ప్రతి ప్రజా విజృంభణములోనూ ప్రజాసమూహములు విప్లవ పద్ధతుల నవలంబించుతూ వున్న చిహ్నములను మనం జాగ్రత్తగా పరికించాము. కాని డిమిట్రాఫ్ చెప్పినట్లు "సంస్కరణవాద స్థానమును ప్రజలు విడిచిపెట్టే వేగమును వున్నదాని కంటే అధికంగా లెక్క కట్టాము." మనం పోరాటములో ప్రజా సమూ

హాలతో కలవలేకపోయాము. ప్రజాసమూహముల జాతీయ వాంఛల పరిణామములనూ రూపములనూ మనం అర్థంచేసుకోలేక పోయాము. పోరాటపు అనుభవాలను సరిగా ప్రజలకు వివరించగలందులకుగాను అప్పటికి ప్రజలు పొందిన ప్రబోధముయొక్క పరిమితికి అనుకూలమైన భాషలో మనం మాట్లాడలేక పోయాము. "ప్రజాసమూహాలకూ సంస్థలకూ నాయకులకూ వుండే చిరానుగత సంబంధములను వున్నదానికంటే తక్కువగా లెక్కకట్టాము. ప్రజాసమూహములు యీ సంబంధమును వెంటనే విడగొట్టనప్పుడు అభివృద్ధి నిరోధకులగు ప్రజాసమూహ నాయకులయం దేవైఖరి అవలంబింపబడిందో ప్రజాసమూహములయందూ ఆవైఖరియే అవలంబింప బడింది." ఆ రోజుల్లో జాతీయమహాసభ యందునూ దాని నాయకులయందునూ కమ్యూనిస్టు లవలంబించిన వైఖరిలోని పొరపాటులను డిమిట్రాఫ్ చెప్పిన యీ వాక్యము క్లుప్తముగానూ సమంజసంగానూ వెల్లడిస్తుంది.

5. 1926-27 సంవత్సరాల స్వరాజ్య పక్షపు రోజుల నుంచి నేటివరకూ భారత జాతీయకాంగ్రెసు చాలా దూరం ప్రయాణంచేసింది. 1920-22 సహాయ నిరాకరణపు రోజుల తర్వాత శాసననిర్మాణవాదుల వేదికగా

నూ, మానవకారుణ్యవాదుల సృష్టగానూ మారిపో
యిన జాతీయ మహాసభ, తర్వాత బ్రిటిషుసామ్రాజ్య
వాదానికి వ్యతిరేకముగా పోరాడుతూవున్న భారత
ప్రజల కేంద్ర సాముదాయిక వ్యవస్థగా పెరిగింది.
ఆరోజులనాటి ప్రజాసముదాయముల పోరాటములు
న్నూ, 1930-32నాటి శాసనోల్లంఘనోద్యమమున్నూ
గొప్పమార్పునకు అవకాశమిచ్చినై. పోరాటము జరిగే
రోజులలోనూ, తర్వాతజరిగిన సంఘటనలవలననూ కాం
గ్రెసుసంస్థ విస్తరిల్లింది. దానినిప్పుడు బూర్జువాసంస్థ అన
డం తగివుండలేదు. కాంగ్రెసుయొక్క పలుకుబడికిలోనై
కాంగ్రెసునడిపిన పోరాటములో పాల్గొన్న ప్రజాసమూ
హాములకు మనం దూరంగానే వుండిపోయాము కాబట్టి
యీ మార్పును మనం అర్థం జేసుకోలేకపోయాము,
అపేక్షించ జాలకపోయాము, పాల్గొని నడిపించలేక
పోయాము.

ముప్పైలక్షల సభ్యులతోనూ, బ్రిటిషు భారతదేశము
లోని అత్యధిక రాష్ట్రాల్లో వోటర్ల మెజారిటీలతోనూ,
సామ్రాజ్యవాద వ్యతిరేకముగా దేశ విస్తృత ప్రజాపో
రాటములను నడిపిన వారసత్వముతోనూ భారతజాతీయ
మహాసభ ప్రజాసమూహాముల దృష్టిలో ముఖ్యముగా

గ్రామములలోని ప్రజాసమూహముల దృష్టిలో సామ్రాజ్యవాద నియంతృత్వమునకు వ్యతిరేకముగా పోరాడు మహోత్తమ సంస్థగా కన్పడుతూవుంది. భారత ప్రజలలోని అత్యధిక సంఖ్యాకుల అవసరములకున్నూ సామ్రాజ్యవ్యతిరేకముగా మనము జరుపు పోరాటము యొక్క ప్రస్తుత స్థితికిన్నీ సరిపడే కార్యక్రమముమీద ఆధారపడి భారతప్రజల నిర్వధిక ఐకమత్యమును పెంపొందించింది కాంగ్రెసు. ఈ పరిస్థితులలో, యివ్వాళ కాంగ్రెసు బూర్జువా సంస్థఅని కొట్టివేయడం, బూర్జువా సంస్థకాబట్టి సామ్రాజ్యవాద వ్యతిరేక ప్రజాసమ్మిళిత సంఘటనమును కాంగ్రెసు సమకూర్చుటకు తగదని నిర్ధారించడం పొరపాటు.

ఇంకొకప్రక్క మనము దత్తు, బ్రాడ్లీలు వ్రాసిన వ్యాసములోని సలహాలంగీకరించి భారత జాతీయ కాంగ్రెసు ఆధ్వర్యమున యిదివరకే సాధించబడిన ఐక్యతను విస్తృతపరచి దానిని స్వాతంత్ర్యముకొరకూ, ప్రజాస్వామికము కొరకూ, పోరాడు భారత ప్రజాసమ్మిళిత సంఘటనము (United National Front) గా మార్చాలి.

6. జాతీయ మహాసభలోని అత్యధిక సంఖ్యాకులగు నాయకులు పారిశ్రామిక బూర్జువా వర్గానికిన్నీ, జాతీయ ధనికవర్గానికిన్నీ ప్రతినిధులని రూఢిగా చెప్పొచ్చు. బ్రిటిషు సామ్రాజ్యవాదానికి వ్యతిరేకముగా సంకుల సమరం జరిపేటంతటి అవసరావస్థ కలిగించడానికి ప్రజాసమూహాసంరంభమును యీ నాయకత్వము సరిగా ప్రోత్సహించనూలేదు, నడపనూ లేదు. ప్రజాసమూహాల మీద ఆధారపడి, ప్రజాసమూహాలపై తాము సంపాదించుకున్న పలుకుబడిని కాపాడుకుంటూనే సామ్రాజ్యవాదులతో కాంగ్రెసులోని యీ నాయకత్వము కొద్ది కొద్ది కాలాల వ్యవధులలో రాజీపడుతూ వుంటుంది. కాని కార్మిక కర్షక ప్రజాసమూహోద్యమాలు ప్రబలములై వురుకులు పరుగులు పెడుతూవున్నాయి; రాజకీయ నిర్బంధితుల విడుదలకోసము విస్తృతమైన ప్రజావుద్యమం రేగింది; కాంగ్రెసులోనే తీవ్రవాదుల పక్షము దినదినమూ అభివృద్ధి అవుతూవుంది; యీ పరిస్థితుల మూలాన కాంగ్రెసు నాయకత్వము యొక్క చాంచల్యమును తొక్కిపట్టడానికి అవకాశము యెప్పటికంటెనూ యిప్పుడు అధికమైంది. పారిశ్రామిక బూర్జువావర్గము తోసహా దేశములోని అన్నివర్గాలకున్నూ ఛెడరేపను

అనే సంకెళ్ళు తగిలించడానికి ప్రయత్నిస్తూ వున్న యుద్ధ వ్యాపార ప్రియమగు బ్రిటిషు సామ్రాజ్యవాదము పట్టుదలనూ ప్రజానిర్బంధమునూ అధికం చేస్తూవుంది కాబట్టికూడా కాంగ్రెసు నాయకత్వాన్ని అనుపూ ఆజ్ఞల్లో నడిచేటట్లు చేయడానికి అవకాశము అధికంగా ఉంది. కాంగ్రెసు నాయకత్వంలోనే కొంతమంది ఉత్తమ నాయకులు తీవ్రవాదులౌతూవుండడంకూడా మొత్తం మొత్తంగా కాంగ్రెసుసంస్థయే తీవ్రవాదధోరణివైపుకు తిరుగుతూ వున్నదన్న నిదర్శనం కన్పిస్తూవుంది. దీని అర్థమేమిటంటే కాంగ్రెసుయొక్క మూలమును విస్తృతపరచడానికి నిశ్చితప్రయత్నంచేసి, కార్మిక కర్షక ప్రజా సామాన్య రాజకీయవిజృంభణములకు కాంగ్రెసు కార్యములతో అతిసన్నిహిత సంబంధమును కూర్చే యెడల బ్రిటిషు సామ్రాజ్యవాదానికి వ్యతిరేకముగా సంయుక్త జాతీయసంఘటనముయొక్క శక్తి నంతటినీ వుపయోగించుటకూ, అట్లు వుపయోగించే సమయంలోనే కాంగ్రెసు నాయకత్వంలో కొంతభాగానికి వున్న రాజీవైఖరిని, సఖ్యమార్గావలంబనమును నిరుపయోగము చేయుటలో జయము గాంచుటకు అవకాశంవుంది. అట్లే జాతీయ మహాసభయొక్క నాయకత్వములోని యేభాగమున్నా

దానినుంచి తొలగిపోకుండానే ఆ సంస్థను బలపర్చ డానికిగాను మనము అందులో ప్రవేశించడానికి యిప్పుడు అవకాశం అధికంగా వున్నదన్నమాట.

7. కాంగ్రెసుసంస్థ మంత్రిపదవులను స్వీకరించడంతోటే కొత్త కొత్త అవకాశాలు దొరికినై. మంత్రిపదవీ స్వీకరణమువలన కాంగ్రెసుసంస్థ సామ్రాజ్యవాదముతో యేకమై పోయిందనిగాని లేక కాంగ్రెసుమంత్రి వర్గాలు సామ్రాజ్యవాద రాజ్యయంత్రంలో భాగాలైనాయని గాని అనడం పూర్తిగాతప్పు. దేశంలో బ్రిటిషుసామ్రాజ్యవాదానికి వ్యతిరేకమైన బ్రహ్మాండసంస్థ, నాయకసంస్థ కాంగ్రెసుకాబట్టే, కాంగ్రెసుమంత్రులు కాంగ్రెసు కార్యక్రమమైనటువంటి జాతీయవిమోచనా కార్యక్రమమును కొనసాగించుటకు శపథము పూనినారు కాబట్టే, వుద్యమ తీవ్రతను తీవ్రతరము చేయుటకు ప్రజాసామాన్యమే కార్యోన్ముఖ మయ్యేటట్లు చేయడానికీ, శాసన సభలో ప్రవేశించి కలిగించిన ప్రజాస్వామిక స్వాతంత్ర్యములను పూర్తిగా వుపయోగించుకుని శాసనసభలకు వెలుపలజరగవలసిన ప్రజావుద్యమాన్ని బలపరచడానికి మంత్రిపదవులను వుపయోగించుకోవడానికీ యివ్వాళ అవకాశముంది. కాంగ్రెసు మంత్రివర్గాలు

బ్రిటిషు సామ్రాజ్యవాదము యొక్క మిత్రరత్నములు కావు; కాంగ్రెసు మంత్రివర్గాలు కాంగ్రెసు మంత్రివర్గాలుగానే వున్నంత వరకూ బ్రిటిషు సామ్రాజ్యవాదంతో అవియేకం కాజాలవు. సమ్మిళిత జాతీయసంఘటనములో అవి అంతర్గర్భితమైన వొక ముఖ్యభాగము. ప్రజావుద్యమములను తొక్కిపట్టేపనిగాని ఆటంకపరిచేపనిగాని వాళ్ళు చేస్తే అట్టి ప్రతికార్యాన్నీ విమర్శించి తీరాల్సిందే. కాని కాంగ్రెసు బయటవున్న జాతీయ వ్యతిరేకమైన సంస్థలను గురించిగాని వ్యక్తులనుగురించిగాని చేసే విమర్శనయొక్క స్వభావానికీ, కాంగ్రెసు మంత్రివర్గాలను గురించి చేసే విమర్శనయొక్క స్వభావానికీ పూర్తిగా భేదంవుంటుంది. కాంగ్రెసు మన సంస్థ, కాబట్టి కాంగ్రెసు మంత్రులు ప్రజలమంత్రులు. ప్రజాందోళనముయొక్క వొత్తిడిచేత కాంగ్రెసుమంత్రులను సంచలింప జేయవచ్చును. పని వినిపించవచ్చును అని మనకు అనుభవమైంది. కాబట్టి రాజకీయవిజృంభణమును శాసన సభల ద్వారామాత్రమే సాగించాలి అనే సిద్ధాంతమును పూర్తిగా తిరస్కరిస్తూనే కాంగ్రెసుమంత్రులు చేసిన ప్రజాహితకార్యాన్ని ప్రతిదానినీ హృదయపూర్వకంగా బలపరచడానికి ముందుకు రావాలి. జాతీయ కార్యక్రమమును

అమలులో పెట్టడానికి తగినంత శక్తిని మంత్రులకు కలిగించడానికి ప్రజాప్రుద్యమముయొక్క సంరంభమును అభివృద్ధిచెయ్యాలి. అధికారప్రభుత్వమూ, జాతీయవ్యతిరేక పెట్టుబడిదారీవర్గమూ కలిగించే ప్రజాస్వామిక వ్యతిరేకమైన ప్రతిఘటమును కాంగ్రెసుమంత్రులు విచ్ఛిన్నము చేయడానికి కాంగ్రెసుమంత్రివర్గాలకు దన్నుగా శాసనసభల వెలుపలకలిగించే ప్రజాబలముతో కాంగ్రెసు మంత్రివర్గాలకు సహాయపడాలి.

8. జాతీయ రాజకీయ సంరంభమార్గమువరకకు కమ్యూనిస్టులు వెంట్పనే తిరగాలి: అందుకుగాను మనమ్ము హృదయపూర్వకముగా జాతీయమహాసభలో చేరి, దానికి బాసటగా పనిచేయప్రారంభించి తీరాలి. సామ్రాజ్యవాదవ్యతిరేకముగా కాంగ్రెసునిర్వహించే ప్రదర్శనాలన్నిటిలోనూ మనము గట్టిగా పాల్గొనాలి. అట్టి ప్రదర్శనాలను కాంగ్రెసులోవున్న కార్మిక కర్షక సంస్థల సమ్మిళిత సంఘటన ప్రదర్శనాలుగా మార్చడానికి చూడాలి. స్థానిక కార్మికకర్షక జనకష్టాలతోనూ, వాళ్ళు అవి నివారించుకోవడానికి చేసే పోరాటాలతోనూ స్థానిక ప్రాథమిక కాంగ్రెసుసంస్థల అనుదిన కార్యక్రమమును

ముడిపెట్టి పల్లెల్లోనూ పట్టణాల్లోనూ కాంగ్రెసుయొక్క శక్తినీ, కాంగ్రెసుయొక్క బలగమునూ విస్తృత పరచడానికి మనం అతిదీక్షగా పాటుపడాలి. కార్మికులయొక్కయు, కర్షకులయొక్కయు; తదితర ప్రజాసామాన్యముయొక్కయు అనుదినపోరాటాలలో మనము స్వాంతంగా పాల్గొనీ, ముఖ్యనాయకత్వము వహించీ అధికార ప్రభుత్వానికీ, జాతీయ వ్యతిరేకపెట్టుబడిదారీవర్గానికీ వ్యతిరేకముగా దోచుకోబడినవాళ్ళను అణచివేయబడినవాళ్ళనూ రక్షించిచేటటువంటి యోధులుగానూ, సమ్మిళితజాతీయసంఘటనములో చైతన్యముగల భాగములుగానూ కాంగ్రెసు ప్రాథమిక సంస్థలను మనము మార్చితీరవలయును.

9. భారత జాతీయ మహాసభను గురించి మనమవలంబించిన వైఖరికి యీ గొప్పమార్పు తెస్తేతప్ప జాతీయ మహాసభయొక్క పునాదిమీద జాతీయైక్య సంఘటనాసౌధమును నిర్మించు సూత్రము నమలులో పెట్టుటకుగాను అతివాదపక్షమునంతటినీ, అతివాదపక్షాలకన్నింటికీ హృదయమువంటిదైన సామ్యవాద సంరంభమును యేకీభవింప జేయుచూ మన నిశ్చయములను కాంగ్రెసు త్రోసివేయు జాలనంతగా కాంగ్రెసులోనే మనము నిశ్చిత

శక్తిగా యేర్పడిననేతప్ప, భారతదేశములో కమ్యూనిస్టులు రాజకీయ శక్తిగా తయారగుట సాధ్యముకాదు. జాతీయ ఐక్యసంఘటనా సూత్రము మనకు అన్నపానీయములవంటిదికావాలి. మనలో ప్రతివాడూ కాంగ్రెసులో సభ్యుడైతీరడమేగాక వ్యక్తివ్యక్తి వరసని కార్మికులనందరినీ కాంగ్రెసులో చేర్పించడానికి గొప్పప్రచారం చెయ్యాలి. కార్మికులను కాంగ్రెసులో సభ్యులుగా చేర్పించేటప్పుడు వుపయోగించవలసిన నినాదాలు యివి:

(1) ఫెడరేషను అమలుజరపడానికివ్యతిరేకంగా పోట్లాడడానికి కాంగ్రెసును బలపరచాలి.

(2) కార్మిక ప్రజాసమూహాల కోరికలనూ, ప్రత్యేకసంస్థా నిర్వహణంచేసుకోవడానికి వాటికున్న హక్కునూ కాంగ్రెసు బలపరచి రక్షించాలి.

(3) కాంగ్రెసును ప్రజాస్వామికముచేసి సమ్మిళిత సంఘటనా ప్రదర్శనాలు జరపడంలోనూ, సమ్మిళిత సంఘటనా సంరంభములను నిర్వహించడంలోనూ స్థానికప్రాథమిక సంస్థలే ముందడుగు వెయ్యాలి.



# "నేషనల్ ఫ్రంటు"

[ 13–2–1938 ] సంపాదకీయమునుండి

రెండు సంవత్సరాల క్రిందట లక్నోలో కామ్రేడ్ జవహర్లాలు నెహూ్రు సంయుక్త ప్రజాసంఘటనమును (Joint Popular Front) గూర్చి వివరించాడు. అతడు చెప్పింది వుబుసుపోక కాదు. గొప్పగా ఆలోచించి చేసిన నిర్ధారణమును అతడు నినాదరూపమున వెల్వరించాడు. మనమిదివరలో జరిపిన పోరాటములవలన కలిగిన అనేక అనుభవాలనుగూర్చి యెంతో ఆత్మవిమర్శ చేసుకున్న తర్వాత జవహర్లాలు ఆ నిర్ధారణకు వొచ్చాడు. మన జాతీయపోరాటపు గతి తార్కికత్వాన్ని వర్గవిభజన సిద్ధాంతముతో వివరించడానికి జాతీయమహా సభాధ్యక్షుడొకడు మొదటిసారి ప్రయత్నించాడు. ప్రత్యేక ప్రత్యేకము జరిగిన పోరాటాలలోని రాజకీయ ఆంతరార్థమున్నూ కాంగ్రెసు కల్పించిన జాతీయ వా తావరణములోనే అయినను కాంగ్రెసుకు బయట అభి వృద్ధిగాంచుతూవున్న కార్మిక కర్షక సంస్థానిర్వహణము న్నూ గుర్తింపబడింది. అయితే ఆగుర్తింపబడుట చరిత్రా త్మికమున్నూ, ముఖ్యమున్నూ కూడాను; భారత జాతీయ

మహాసభాధ్యక్షు వేదికనుండి అది ఆమోదింప బడింది. శాసనోల్లంఘనోద్యమము కూలిపోయింది; ఇదిచూసి నిర్విణ్ణులూ నిరాశాహతులూ అయిపోయిన కాంగ్రెసు సాధారణసభ్యుల సమూహములు అప్పుడు రూపమెత్తు తున్న నూతన రాజకీయశక్తి వంకకు పరుగులెడుతున్నవి. కార్మికులూ, కర్షకులలో కొన్నిభాగాలూ జాతీయో ద్యమమునుయొక్క విజృంభణముతో యేకమగుటకు ప్రయత్నిస్తూవున్నారు. తమ సంస్థా నిర్వహణమునే తమ పోరాటమునే విస్తృతపరచడానికీ, సామ్రాజ్యవాద వ్యతి రేకమైన పోరాటమును అభివృద్ధి పరచడానికీ యిట్టి ఐక్యత అవసరైక్యతగా వాళ్లు గణించారు. ఈ రెండు ధోరణుల ఫలితములనూ సామ్యవాది యైన కాంగ్రెసు అధ్యక్షుడు ముక్తసరిగా యిలా ప్రకటించాడు. "సామ్రా జ్యవాదంతో యెట్టి పరిస్థితిలోనూ రాజీకి దిగని వ్యతిరేక తయే సంయుక్త ప్రజాసంఘటనంయొక్క సారమై తీరాలి కార్మికులూ కర్షకులూ అధికాధికముగా పాల్గొనుట నుంచియే సామ్రాజ్యవాద వ్యతిరేకశక్తికి బలమువచ్చి తీర వలయును" మన జాతీయ విప్లవములో ప్రస్తుతము యొక దశవచ్చింది. ఆ దశను నిర్వర్తించడానికి అవసరమైన మా ర్గమూ క్రమమూ యేదియో కాంగ్రెసునాయకత్వములో

అత్యున్నత స్థానము అధికారరీత్యా కాకపోయినను మొట్టమొదటిసారి గుర్తించింది.

తర్వాతి యెనిమిది నెలలు సూత్ర నిర్ధారణమునుండి సంయుక్త సంఘటనా నిర్మాణమువరకే మనము నడవ సాగేము. బొంబాయిలో జరిగిన అఖిలభారత ట్రేడు యూనియను కాంగ్రెసు భారత జాతీయమహాసభను అభివృద్ధి పరచడానికీ, జాతీయమహాసభను సామ్రాజ్య వ్యతిరేక ప్రజాసంఘటనముగా మార్చుటకూ నిశ్చయించి సమష్టిగా కార్మికసంఘములను భారత జాతీయమహా సభకు అనుబంధముచేయడాన్ని గురించి వొకప్లానుకూడా తయారుచేసి రాజ్యాంగానికి వ్యతిరేకముగా ప్రజాపుద్య మాన్ని అభివృద్ధి పరచుటలో రాబోయే యెన్నికలలో జాతీయ మహాసభను బలపరచడానికి తీర్మానించింది. పారిశ్రామిక కార్మికులు సమ్మెలు చేయడం అధికమౌ తూ వుంది. రైతుపుద్యమము శీఘ్రగమనముతో అభివృద్ధి అవుతూవుంది. 1936వ సంవత్సరములో గోరక్, అంబర నాథ్ మొదలగు చోట్ల జరిగిన అనేకసమ్మెలలోనూ, పాకీపనివాండ్రూ, వెనకబడివున్న కూలీలు జరిపిన అనేక సమ్మెలలోనూ, బెంగాలు నాగపూరు రైల్వేలోని కార్మి కులు జరిపిన సంయుక్తసమ్మెలోనూ, కాంగ్రెసు యొక్క

కాంగ్రెసుయొక్క అభిమానమూ సహాయమూ కావలసి వచ్చింది. రాజకీయ నిర్బంధితుల విడుదలకోసము నిర్బంధ వ్యతిరేకముగా జరిగిన పౌరసత్వపుహక్కుల సంరక్షణా ప్రచారం సమష్టిగా జరిగి అభివృద్ధి పొందింది. కాంగ్రెసు కమిటీలు, ట్రేడుయూనియనులు, సోషలిస్టులు, కమ్యూనిస్టులు పాల్గొన్న సంయుక్తసభలూ, ప్రదర్శనములూ, పూరేగింపులూ. అనుదినవ్యవహారములై పోయినాయి. తీవ్రవాదశక్తుల ఐక్యతా సహకారములు లోగడ కంటే బాగా అభివృద్ధి నైనవి. ఫ్రాన్సులోనూ స్పెయిన్ లోనూ ఫాసిస్టుల యొక్కయు యుద్ధవ్యాపారుల యొక్కయు సంరంభములకు వ్యతిరేకముగా ప్రజా స్వామిక సంఘటనములు జరిగి కార్మికోన్ముఖత్వమునకు ప్రథమ విజయములు సాధింపబడినవి. ఈ రెండు దేశాలలోనూ ధనికవాదానికి వ్యతిరేకముగా సంయుక్తముగా జరిగిన పోరాటములో సోషలిస్టులకు కమ్యూనిస్టులకూ చక్కని సఖ్య మేర్పడసాగింది. ఈదేశాలలో ప్రజాసంఘటనములు గాంచిన అద్భుత విజయముల మూలమున భారతదేశము లోని ఉద్యమం సమ్మిళిత జాతీయసంఘటనముగా మారిపోవుటకు గుణపాఠము గ్రహింపబడింది. చైనాదేశాన్ని కబళించడానికి జపాను సామ్రాజ్యవాదము విజృంభించి

నప్పుడు నేషనలిస్టు చైనాలోని ప్రజాసమూహములో నుంచి సమ్మిళిత జాతీయ సంఘటన మేర్పడవలెనని చైనా సోవియటులు(కమ్యూనిస్టుసంఘములు)పదేపదిగా చేసిన సంబోధనను చైనాప్రజలు అధికాధికాభిమానంతో ఆదరించి జపానును యెదిరించుతూ నిలబడగలగడంకూడా భారతదేశీయుల కొక ప్రత్యేకార్థమునూ, సందేశమునూ యిచ్చింది. లక్నోలో భారతజాతీయమహాసభ జవహర్లాలు అధ్యక్షతను జరిగినతరవాత యెనిమిది నెలలకు ఫెయిజుపూరులో మరల అతని అధ్యక్షతనే జాతీయ మహాసభ జరిగింది. ఈ యెనిమిది నెలల్లోనూ కలిగిన అభివృద్ధిని స్పష్టముగా జవహరు యిలా ప్రకటించారు:

<u>అట్టి సంఘటనములో సంఘనిర్వహణముగల కార్మికులున్నూ కర్షకులున్నూ యింకనూయింకనూ అధికంగా పాల్గొనడం ఆహ్వానించి తీరవలసివుంటుంది. గత సంవత్సరం యొక్క ముఖ్యలక్షణం యీ వర్గాలకున్నూ కాంగ్రెసుకున్నూ మధ్యయెంతో సహకారం జరగడం. ఈ వైఖరిని ప్రోత్సహించి తీరవలయును.</u>

ఫెయిజుపూరు జాతీయమహాసభకుముందు జాతీయ సంఘటన మేర్పడాలి. యీ యీ-శక్తికల సది కోరాలి అనే భావప్రచారము జరగడమే ప్రధానసమస్య. ఆ సం

ఘటనమేర్పడడంలోని కష్టాలూ, అందువలన కలిగే సమస్యలూ ఆనాటి పరిస్థితులవలన పూర్తిగా తేలలేదు. కాంగ్రెసు అధ్యక్షుడు "భారతదేశానికి వెంటనే కావలసిన ముఖ్యావసరము సామ్రాజ్యవాద వ్యతిరేకముగా దేశములోని అన్నిశక్తులూ అన్ని వర్గాలూ జాతీయ సమ్మిళిత సంఘటన మేర్పఱచడం" అని ప్రకటించాడు. అధ్యక్షునితో అందరూ యేకీభవించారు. ఈ ఐక్యతకు పునాది సామ్రాజ్యవాద వ్యతిరేకతయునూ స్వాతంత్ర్యము అని అందరూ వొప్పుకున్నారు. "ప్రజాప్రతినిధిపరిషత్తు ఏర్పడాలి, తద్వారా రాజకీయ స్వాతంత్ర్యము ప్రజాసామాన్యపరముచేయబడిన ప్రజాస్వామికము స్థాపించబడాలి." చివరకు "భారతదేశాక్రమణము చేసిన విదేశసైన్యము యీ దేశమునుంచి వెళ్ళిపోవాలి అనే కోరికను సంయుక్త సంఘటన వెంటనే కోరాలి." అని అందరూ వొప్పుకున్నారు. కాని మనవుద్యమములో రెండురకాల ధోరణులువున్నాయి. రెండు ధోరణులూ ఐక్యసంఘటనము కోరేవే. అయితే సంయుక్తసంఘటనా నిర్మాణము యెట్లు జరగాలి అనే చోటనే యీ రెండు రకాల ధోరణులకూ భేదము.

రాజ్యాంగమును భగ్నము చెయ్యడానికి సంయుక్త

జాతీయ సంఘటనమేర్పడాలి అనే నినాదము అందరికీ నచ్చినదే. అందరూ వాడుతూవున్నదే. కాని అక్కడ వచ్చిన చిక్కేమంటే యీ సంఘటన యెలా యేర్పడాలి? అని శాసనసభలో మెజారిటీలు సంపాదించుకోవడానికి ప్రజాసమూహాలు సహాయపడిన తర్వాత సామ్రాజ్యవాద వ్యతిరేకతను నడుపుట శాసనసభలకు వదలి ప్రజాసమూహములు చేతులు నలుపుకుంటూ కూర్చోవాలా? లేక ముందురాబోయే సంకులసమరమునకు సన్నద్ధులు కాగలందులకుగాను ప్రజాసమూహములు శాసనసభల బయట బలమైనశక్తులు కావడానికి శాసనసభలుపయోగపడి ప్రోత్సహించడం మాత్రమే చెయ్యాలా? సంస్కారమా లేక విప్లవ పోరాటమా? రాజీమార్గమా లేక, రాజీ యెరుగని అప్రతిహతయుద్ధమా? అనే అభిప్రాయం పూర్వమునుంచీ వస్తూవుంది. ఈ రెండుధోరణులూ ఐక్యసంఘటనము విషయములోకూడా వాటికివాటికే అనుకూలమైనట్లుగా సంయుక్తసంఘటనా సిద్ధాంతానికి పూనుకొన్నాయి. సామ్రాజ్యవాదము జాతీయ వ్యతిరేక ప్రయోజనపరులూ ధనికులలో చాలా భాగానికి కూడా వ్యతిరేక పక్షమే కాబట్టి ఆ పక్షానికి వ్యతిరేకముగా ధనికులలోని కొందరినికూడా కలుపుకుని అన్నివర్గాలకూ మధ్య ఐక్యత

కలిగించవలెను. కానీ అదివొక కనీస కార్యక్రమమువీద ఆధారపడిన ఐక్యత: యీకనీస కార్యక్రమమును సాధించుటకు జరగవలసిన పోరాటము కొరకు కావలసిన ఐక్యత దాని మూలమున వర్గపోరాటము బహిష్కరింపబడలేదు. కానివర్గపోరాటము పరిస్థితినిబట్టి యింకొక తరహాది అయినది. ఒకప్రక్క సామ్రాజ్యవాద వ్యతిరేకులైన ప్రజలు, రెండో ప్రక్క జాతీయవ్యతిరేక ప్రయోజన కూటములు. కాబట్టియిట్టి వర్గపోరాటము జాతీయమహాయుద్ధ రూపమును దాలుస్తుంది.

ఫైజుపూరు తర్వాత ప్రజాసామాన్య పోరాటము అతి త్వరగా అభివృద్ధి అయింది. ఈ అభివృద్ధి యీ క్రింది విషయములను స్పష్టము చేసింది. (1) ఎన్నికల ప్రణాళిక లోని కోర్కెలూ కార్యక్రమమూ ప్రజలలో అత్యధిక సంఖ్యాకులకు ఆమోదనీయము కాగలవు, (2) ఈ కార్యక్రమమును గూర్చి ప్రజలు గట్టి పట్టుపట్టి దానిని తమ సంస్థా నిర్వహణములూ పోరాటములూ అభివృద్ధి చేసుకోవడానికి పునాదిగా వుపయోగించు కుంటారు. (3) జాతీయసమ్మిళిత సంఘటనముయొక్క పునాది విస్తృతమౌతుంది. "కార్మికులూ కర్షకులూ అధికంగా పాల్గొనటముతోటే" సామ్రాజ్యవాదమూ దాని మిత్రవర్గములూ గట్టిదెబ్బతింటాయి. (4) కార్మికకర్షకవర్గము యొక్క

సంస్థానిర్వహణ, రాజకీయ, ఆర్థికచర్యలు అధికమైనకొద్దీ ఆసంస్థలు బలపడుతూవుంటాయి, సమ్మిళిత సంఘటనా వుద్యమము సామ్రాజ్యవాదానికి అపాయకర మౌతుంది, అప్పుడు సామ్రాజ్యవాదమూ, దాని మిత్రవర్గాలూ గట్టిగా ప్రతిఘటించి, నిర్బంధాలు అధికంచేసి సమ్మిళిత సంఘటన భగ్నంచెయ్యడానికి మహాప్రయత్నాలు చేస్తాయి. (5) సామ్రాజ్యవాదమూ దాని మిత్రవర్గాలూ చేసే యీ దాడికి జాతీయసంఘటనములోని పెట్టుబడిదారులు మొదలగువాళ్ళు తడబడపడి, అంతకు ముందు వొప్పుకున్న కార్యక్రమాన్ని కుంచింపజేయడానికీ, హీనపరచడానికీ, కార్మిక కర్షకపోరాటాలలో అభివృద్ధి గాంచుతూవున్న శక్తులను అణచిపెట్టడానికీ, కార్మిక కర్షకులను జాతీయ సేనాముఖము నుండి తొలగించ డానికీ మొదలు పెడతారు. జాతీయ సంఘటనములో విద్రోహులూ, విభజనకారులూ అధిక ప్రతాపము చూపుతారు.

జాతీయవ్యతిరేక ప్రయోజన పరుల విజృంభణమూ దాడి అధికమైన కొద్దీ జాతీయసంఘటము యొక్క నాయకత్వములో సంస్కరణ మార్గమునూ, రాజీధోరణినీ అవలంబించే భాగము తీవ్రవాద శక్తులపైని దాడి అధిక పరుస్తుంది. రైతుకార్యము నములు పరచడానికి ప్రజానుమతి

నిచ్చియుండక రైతుసంఘములను నిషేధిస్తున్నారు. ప్రతి నిధుల యెన్నికలలో అతివాదులూ సోషలిస్టులూ యెన్ను కోబడకుండా నిశ్చిత ప్రయత్నాలు జరగడం చూస్తున్నాము. మైసూరు, తిరువాన్కూరు మొదలగు సంస్థానాల లో సాగుతూవున్న ప్రజాపోరాటములను నిర్నిబంధ ముగా బలపరచుటకు అనుమతి నిరాకరింపబడుతూవుంది. జవహర్లాలునెహూ్రి లక్నోలో జరిగిన జాతీయ మహా సభలోనే మంత్రిపదవుల నాధారంచేసుకుని ప్రజావుద్య మములమీాద సామ్రాజ్యవాదముయొక్క నిర్బంధయంత్ర మును కొంతవరకు వుపయోగించడం జరుగుతుందేమో నని భయమును సూచించాడు. అట్టి భయము నిజమే అయి, సామ్రాజ్యవాద నిర్బంధయంత్రముతో సహకార ము జరిగిన ఘటన లనేకం జరిగినవి. ఆ నిర్బంధచర్యలు అహింసాబురఖాక్రింద న్యాయమైనవే అని సమర్థింపబడు తున్నాయికూడా.

ఈ ఘటనలమూలాన కష్టమైన పరిస్థితి వొకటి దాపు రించింది. ప్రజాసామాన్య పోరాటములో అభివృద్ధిగాంచు తూవున్న శక్తులను అణచిపట్టడానికి ప్రయత్నించడమే గాక బాల్యదశలోవున్న జాతీయసమ్మిళిత సంఘటనమును రూపుమాపడానికి కూడా ప్రయత్నాలు జరుగుతున్నా యి. రైతుసంఘమునకు కాంగ్రెసుకూ విభేదంకలగడం

సోషలిస్టులనూ కమ్యూనిస్టులనూ కాంగ్రెసు సామాన్య సభ్యవర్గములోనుంచి తొలగించడం బ్రిటిషు భారత రాష్ట్రములలో జరుగుతూవున్న జాతీయ పోరాటమును స్వదేశ సంస్థానాల ప్రజల పోరాటమునుండి విడగొట్టడం. కాంగ్రెసును శాసనసభాపక్షముగానే మార్చడం యీ పనులు సామ్రాజ్యవాదులకూ, అభివృద్ధి నిరోధకులకూ కలిగించినంత సంబరం యింకేపనులూ కలిగించలేవు.

సోషలిస్టులూ కమ్యూనిస్టులూ— అతివాదులందరూ యేకమై యిట్టి మహాత్పాతము జరగకుండా చెయ్యాలి. సమ్మిళిత సంఘటనములో వున్న విభేదకర వైఖరులను నిర్మూలించాలి. సమ్మిళిత సంఘటనమునకు హృదయపూర్వకమైన మేటి పర్మాతలు కావాలి.

ఇప్పుడు అతివాదులు రెండుపనులు యేకసమయాన చెయ్యాలి. (1) కార్మికకర్షకుల ప్రత్యేకవర్గసంస్థా నిర్వహణమును అభివృద్ధి పరచడానికి అతివాదులందరూ యేకమవ్వాలి. (2) జాతీయసంఘటనము యొక్కయు, జాతీయ మహాసభ యొక్కయు ఐక్యతను కాపాడాలి. ఈ కార్య నిర్వహణములో, అతివాద శక్తులను ఐక్యపరుస్తూన్న భావాలూ కార్యాలూ యేకంకావాలి. మనఃకర్మల ఐక్యత ద్వారా చివరకు సంయుక్త కార్మిక వర్గ సోషలిష్టుసంఘ నిర్మాణమును సాధించాలి.